# A FOOL
# &
# HIS FAMILY.

## దుర్మార్గచరిత్రము

విష్ణుభట్లసుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచింపఁబడి

ఏలూరు.

---

మంజువాణీముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటించడమైనది.

---

1906 సం॥

Price 4 As.

శ్రీ

సప్తకోటీశ్వర స్వామినే నమః.

# దుర్మార్గ చరిత్రము




మానితధవళాంగా।
వామోన్నతవృషతురంగవనధినిషంగా।
ధీమన్మనోబ్జభృంగా।
కామాంగవిభంగమల్లికార్జునలింగా॥ 1

వ॥ అవధరింపుము సకలదుర్గుణ ధుర్యుండగు సాతాని చెవిటిబస
వయ్యాచార్యవర్యునకు హీనవిశ్వస్తాభుజంగుండగు జంగమ
మూగపెరుమాళ్ళలింగమిల్లనియె॥ 2

సీ॥ భుగభుగధ్వనియుతభూరివైశ్వానర,
జ్వాలాంతగతకుణపవ్రజంబు।
బహుతరజీర్ణశూర్పచ్ఛన్నదగ్ధాస్థి,
సహితదుర్గంధభస్మవ్రజంబు।

సర్ధదగ్ధవిదళితానేకవంశభి,
త్తిచయసంవ్యాప్తసూత్రవ్రజంబు
బల్యన్నభక్షణప్రచురలాలసకూజి,
తబహుళారిష్టగృధ్రవ్రజంబు॥

గీ॥ విపులఫేరవరవభయవిశ్రుతంబు।
లాన్యభూతప్రభూతభీలాలితంబు।
విమలగంగాతరంగమహితాని।
లాభిహితపితృవనభూతలాంతమందు॥ 3

వ॥ సత్యవచన సముద్భూత సమజ్ఞాసాంద్రుండగు హరిశ్చంద్రుం డున్న సమయంబున నజ్ఞానవిలోకియగు నవివేకియన ధరామరుండరుదెంచి సపర్యలనానందిత హృదయారవిందుండయ్యె నయ్యెడ నద్ధరణీపురందరుండు తనడెంపంబునంగల కొందలంబునంగుంది కందినయనారవిందంబుల నశ్రుబిందుసందోహంబులుచిందమందమందస్వరంబున నవ్వసుంధరాబృందారకునితోడ నిట్లనియె॥ 4

క॥ దారుణివిభవముబంధుల।
దారసుతుల్ బాసితప్పనిముప్పుల్।
ఘోరశ్మశానముననే।
హారముగనుసన్నుఁబోలువాఁడుంగలఁడే॥ 5

క॥ విభవాన్వితమద్వంశ।
ప్రభువులలోలెక్కకొక్కప్రభువైననుశో।

కభరయుతుండు "సభూతో|
సభవిష్యతిమత్సమోస్తు" నాజనువిప్రా|| 6

వ|| అనినవివేకి యిట్టులనియె|| 7

చ|| ఒకతఱిచండుఁడైనరవియొక్కతఱిఁ ఖరకాంతిఁ బాయఁడే
యొకతఱి వెల్గుచున్న శశియొక్క తఱిఁ గృశతన్వసింపఁడే|
ప్రకటితశౌర్యసంపదలు పాయుచువచ్చుచునుండుఁగానసీ|
వికవెతనొందకయ్య గనసెంతటివారలుఁగష్టమొందరే| 8

గీ|| కాంతలను బాసి పదవులఁగరముఁగోసి|
విపినములఁడాసిపొందుచు నెపుడుగాసి|
హరిహరబ్రహ్మలుంగూడ సహరహంబు|
మనుటపూర్వకాలమునందు వినమెకనమె|| 9

క|| అనవిని యినకులచంద్రుఁడు|
మనమునఁగడువింతనొంది మన్ననబల్కెఁ|
వినుపింపుమయ్యయీకథ|
గనవారలకష్టములకుఁగారణమెదో|| 10

క|| నావినిభూసురవర్యుఁడు|
భావంబుననుబ్బియిట్లుపలుకఁదొడంగెన్|
శ్రీవిన్దుర్మార్గాఖ్యుని|
భూవిభునిప్రభుత్వమందుఁబుట్టెంజెట్టల్|| 11

వ|| అనినసమ్మహీంద్రుండిట్లనియె,దుర్మార్గుండను తేడెవండు,వానిరా
జ్యంబెట్టిది, పత్తనంబేది యతనిరాజ్యంబుపలనమువ్వరవేల్పు

ల కెటులవెతలుపుట్టె, నవి స్తరంబుగ జెప్పవేయనిన నమ్మహీసు
రుండిట్లనిచెప్పఁదొడంగె॥ 12

శా॥ శ్రీమద్వాయసఘూకఘూర్ణితవిపచ్ఛిప్రపూర్ణగేహంబునన్।
ద్దామత్విట్త్రిచతుష్షడష్టదశశాద్రిప్రక్రియాత్యంతమః।
శ్యామంగళ్యవికీర్ణధిష్ణ్యమును నానామేయవన్యామయా।
స్థేమస్వాంతమరంతతాపసృగణాశ్లేష్టంబసౌఖ్యాఖ్యచేన్॥

ఆ॥ ఒక్కకోటికరయొలయు నుగిమెఱుంగుడుబుర్వ
ములడ్డిచీకువాలు మొనయువెలుఁగు
నూజఁజీలికన్ను తేజునసబుబరం
బగుచుపీటి పజలుమిగులఁబొగడ॥ 14

క॥ మెఱుఁగుడులుజీలులూఖులు।
సరీసృపములురగవరులుఁజలువగుజాల్వా
గురికలుఁగడుము స్తలమే
పరులున్గలవా పురమున బహుసంఖ్యలుగన్ 15

గీ॥ మొండిగోడలు చవుడులుసందుదొడ్లు
పాడుబొందలు మిట్టలుపల్లములును
గలతెరవులును బందులుకలఁచునట్టి
గుంటలేవంకనుండును గొట్లకొలది॥ 16

గీ॥ ఇట్టిపురమునఁ గుజనులయినట్టిపెద్ద
వారువాసంబుగానుండివాంఛతోడ
మిన్నుమన్నునుదెలియక మెలఁగుచుండ్రి
పేడకుప్పలోపురువులవిధముగాఁగ॥ 17

గీ॥ పదునెట్లసవారుల కెచ్చులయిన
నొంటిబాజాలకెంతేని లోటుసున్న
చావుఁగూడులు కుడిచినఁజన్నగట్ల
మూఁకకాకులతోఁ గూడవీకబలిసె॥ 18

చ॥ ఘనతఱిదాఁటుఁబెంచొకతె ధాణిగొడ్డువిధానఁజచ్చెఁగా
తనసుతుఁడ్రుష్టుఁడంచొకతె ధర్మపురంబున విందుపెట్టెనై
తనపితయేగెనంచొకతె తల్పఁగనిష్ఫలబొట్టుపయికిఁదా
మనయముబ్రహ్మవడ్డపలె నార్చెదరాపురిగీముగీమునన్॥ 19

చ॥ చెలువుదలిర్పఁజోణ మగుచేలము పాదము నంటిఁద్రేలఁగుం
తలగణమింతపెంబొదవిధంబునఁ గ్రాలనజస్రముత్కుధా।
రలునయనంబుల స్వేదశిఖ్రాలవసించుఁగవీంద్రుతోఁటక।
కల్లుములగొంతి యుక్కళలకాలమునాపురిగీముగీమునన్॥

సీ॥ అచటిబాపలకొక్క యక్కరముపాలికిక్క,
పొట్టనేమాలను బొడిచిగనిన।
నచటిరాచకొలంబు లస్త్రయురుకుచుండు,
చీమచిటుకుమన్న జెందిభీతి।
నచటిమూడవకులం బఖచేతిలోనవై,
తుంతంబుఁజూపించి కొంద్రుసొమ్ము।
నచటిబల్లిజెలుధ రామకులధనంబుఁ,
బొడిబెల్లమువలెఁ బొక్కుచుండ్రు।
గీ॥ అచటివారకాంతలుకోతులందమంత।
మించినాట్యంబు సేయుచు మెలఁగుచుండ్రు।

అచటఁబుట్టినబంగారమరయమన్న।
నచటఁబుట్టినయుక్కైనసరయుఁజెడల॥ 21

గీ॥ పారవైచినవిస్తరిపజ్జచేరి।
కుక్కలొండొండు పోట్లాడుకొనెడుమాడ్కి।
నాపురవుఁబాపలెల్లరుకోపమునను।
బ్రతివిషయమునఁ బోట్లాడిపరగుచుంద్రు॥ 22

గీ॥ కొక్కెనెక్కుఁడొక్కఁడు కొట్టుకొనుచునప్పు।
యాలిబూతులలెస్సఁగాఁబ్రేలికొనుచు।
ముష్టియుద్ధంబు నొనరింత్రు భూదివిజులు।
బడుగులైనను వారలుఁపిడుగులౌర॥ 23

ఆ॥ దళముశివునిమీఁదతలఁపునానలమీఁద।
నుంచికొంగజపము నొనరసలిపి।
వెలియటంచుఁబ్రియతుల వలెనుబీదలసప్తు।
కట్లవిధవలచటయ్యావిబుధులు॥ 24.

క॥ బుడిచెంబులు చేతంగొని।
మడిసంచులమూపునిడిమానికలనుబోల్।
పొడికాయల గొండినిడి।
బుడబుడసంభాషలకుఁబోదురుపారుల్॥ 25

తే॥ కాళ్ళనెత్తెత్తివేయుచు గంతులిడుచు।
నింగిచుక్కలనెన్నంగనేర్పులము।
టంచుదొంగపాఠ్యములాడి సంచరింతురి।
ధరణిగోముఖవ్యాఘ్రిలద్వైతులచట॥ 26

ఆ॥ మోముపట్టుఁబట్ట నామాలుకడుఁబెట్టి।
జుట్టుసాగదీసి చిట్టుముడిని।
జుట్టియంచుబట్ట కట్టుదుర్ వైష్ణవుల్।
పొట్టనక్కరంబు పుట్టుకుండ॥ 27

ఉ॥ పేరురమందు వ్రేల తెగవేసెదులింగముగట్టి పెద్దక్షా।
ఝ్జారవునందియుంగరముజుట్టన వ్రేలికిఁబెట్టి వెఱ్ఱియా।
చారముబట్టిస్తోత్రములను సాపడువేళల నెట్టిపొట్టనిం।
డారఁగనుల్లిగడ్డలను హాయిగతిందురు శైవులవ్వారిన్॥ 28

తే॥ మొగమునందున మేలెల్ల ముద్రలుంచి।
యిలనుగాయత్రిఁజెప్పంగ నెచటొ విన్న।
దానివలెనున్న దనియందురి ద్వైతులచట।
వసుధ బేరుల సాకుల వారువారు॥ 29

తే॥ అస్పృతమాడుటే లౌక్యమటంచు నెంచి।
పొట్టనేవంకనుబొడిచి పొడిచిగనిన।
నక్కరము లేక నేయుండు రచటిలౌక్యు।
లక్షరాలవిధవ లయ్యులక్షలేల॥ 30

సీ॥ అందుందుదిరుగాడు నడవిపిల్లులజూచి,
గొంటెలఁబడు శ్వానబృందములను।
నచ్చటఁగలయూరఁ బిచ్చుకలఁగనియిల్,
చొచ్చెదు శ్యేనసముచ్చయములు।
నచ్చోటఁగలపేడ బుర్వులఁగనిగూళ్లు,
జివ్వునఁబడు కాలి చివ్వగములు।

నక్కడకలలోన బక్కవారలఁగాంచి
త్రొక్కడుల్ పడునట్టిమొక్కలులను।
గీ॥ నిహపరంబులుగా నెంచియెవ్వరేమి।
సుద్దుచెప్పినను వినక మొద్దులుగతి।
శిలలచందానఁ దిండితిప్పలను లేక।
కాలమును బుత్తురచటి నృపాలవరులు॥ 31
తే॥ కోరమీసముల్ దువ్వుచు కుక్కజాతి।
నూరఁబందులపై కెగఁబారనిస్స।
టంచుఁ బుఱ్ఱకొప్పుదురచటి యువనిపతులు।
మూలనున్న ముసలిదాని మోదినట్లు॥ 32
చ॥ మిరియములున్న వేయనిన మొంతులుగావలె నేయుటంచు గొం
దఱుఁగడు మంచిదైన తరుద్రవ్యములందునఁ జెత్తనించి ఫ
స్టురకమటంచుఁ గొందరు విశుద్ధపు వస్తువు దెమ్మటన్న మం
దిరమున కేగియద్దికొని తెత్తురుకొందరు వైశ్యులప్పురిన్॥ 33
చ॥ హాలమనుపేరెఱంగరు బుధావళిపల్కిన భూషణంబులన్।
గలనయినం దలంపరర కానికి నెన్నియొ మాలకూడులన్।
జెలఁగిభుజించువారలకు జేతులనొగ్గుచుఁ జెడ్డసేతులన్।
సలుపఁగడంగుచుండ్రచటి నాలవజాతి విజాతిజాతమై॥ 34
గీ॥ రామరామాయటంచు విరామమేమి।
లేకదశావిధావస్థల లీలబడలి।
యరయ సూర్యశ్చ కగ్నిశ్చ యనుచుఁ దప్పుఁ
జెప్పుదురు మతిలేమి నచ్చిష్యులచట॥ 35

ఆ॥ ఒకనిచూడకుండసుకనినాహ్వానించి।
యొకనిసరసకేగుచుండియొకని।
తోడనుగుసగుసలనాడి వేరొక్కని।
కలిసికొంద్రుధనముగణికలచట॥ 36

గీ॥ గురువులఘువులెఱుంగనిగొప్పకవులు।
ఆఱుమూడుకల్పలేనియట్టిలాయర్లు।
తెట్టురామశబ్దమురానిపుట్టుశాస్త్రు
లుండురటనేతిబీర్కకాయోపమగను॥ 37

వ॥ తానిషాలనాడు దాచినయాజ్యంబు।
హాస్తులుతినఁబియ్యమన్నముప్ప।
కారమదిలేనికూరకేనతుత్ర।
మంత్రుడువంటులమ్మలక్కలచట॥ 38

సీ॥ రంకులాడేనియు సుంకంబుచెల్లింపఁ,
గొనిపిడిగంటలఁ గొట్టువారు।
వేదాంతులమటంచు విధవలకుమునుంగు,
వేసియుఁరోజముల్ వెతకువారు।
ఇలనుస్వహస్తపా కులమంచుపిండివం,
టలపట్లనియమంబుతోలఁగువారు।
చదువురాకున్ననుశాస్త్రిభిదానముల్,
మాత్రంబువిడువకమనెడువారు।
గీ. ద్రోలనున్నపొగడికయుమోముఁద్రిప్పఁ
గాంచియేమొకల్పించినిందించువారు।

నోటితోఁడమాట్లాడుచు నొసలతోఁడ।
వెక్కిరించువారెన్న నవ్వీటిజనులు। 39

సీ. దారమీఁదను దప్పిదము మోపి విడనాడి,
వలపుసానుల యిండ్ల మెలఁగువారు।
కాశికేఁగెదమంచు గాసులనార్జించి,
గోపడంతులకిచ్చి మ్రొక్కువారు।
సొగసుగానలరారు సుదతి పోవుచునుండ,
ఱెప్పవేయక చూచు గొప్పవారు।
ఆలి చెప్పిన కొండెమాలించి కోపాన
మాతృదేవిని గొట్టి మనెడువారు।
పూర్వులార్జించి పెట్టిన భూములన్ని।
వ్యాజ్యములకు సమర్పించి వరలువారు।
కలఁగఁ గోటానకోటులు కలిపురుషుని।
యంశలనుగొని వచ్చిరో యనఁగ నచట॥ 40

సీ. కల్లు ద్రావిననాడు కంపుగొట్టువటంచు,
నుల్లిపాయలఁ దినుచుండువారు।
పరధనంబెత్తుట పాడిగాదని పెంకు,
టిండ్లకు నిప్పంటించువారు।
అన్యుల మది నొవ్వనాడిన కీడని,
తోడఁబెకుత్తుకలను ద్రుంచువారు।
జారత్వమెన్నఁడు సల్పరాదని పాపి,
తప్పి కాంతల బల్మిఁ దవులువారు।

గీ. లేనిపోనిప్రలాపముల్ మానవలయు।
నంచుఁ గడుకూటసాక్ష్యంబులాడువారు।
నిందజేని నెక్కి చెప్పంగ నందు నుండు।
పండితంమన్యులకెగాక పరులకగునె॥ 41

ఉ॥ క్షాత్రికులు లబ్ధపర్ణగణఘోరులు దుర్గమకాననాద్రిసం।
చారులు కల్మషాశ్వతవిచారులు సత్కులపాళికాళిసం।
హారులు హేయదుష్పథవిహారులు బాలిశమత్తకాముకా।
ధారులు రోహిణీశ్వరవిదారులు చోరులు పౌరులారయన్॥ 42

ఉ॥ అందరుధూర్తవర్తనులె యందరు దుఃఖనిమగ్నచిత్తులే।
యందరుసౌఖ్యనాశనులె యందఱు స్త్రీద్రవిణాభిలాషులే।
యందఱు ప్రాణిహింసకులె యందఱు దుష్టగణోపకారులే।
యందఱుజారచోరులె యమందఱు పౌరులు కాలచేరులే॥ 43

ఉ॥ మేముధనాగ్రగణ్యులము మేముసదన్వయజాతసంచిత।
ద్భీమయశఃప్రపూర్ణులము మేముగజద్విడహీనశౌర్యుల।
క్షేమమహాత్తోత్తమాంశులము మేముసమస్తకళావిచక్షణో।
ద్దాములమందు రల్పులెక దామురహంక్రియనొంది సిక్కుటల్॥44

చ. గురువులపాదరక్షలను గూలఁగఁగొట్టని వాఁడు నాపురిం।
బకలకుఁ గీడు చేసెడు స్వభావము మానిన వాఁడు నెప్పుడో।
దరభరణంబుదక్క పెరదారినిఁ బోవని వాఁడు కోటికో।
క్కరుఁడును గానరాఁడు కలకాలము దేపని గాఁగఁ గాంచినన్॥45

ఉ. క్రూరులు జారులుం దలఁపఘోరులు చోరులు వారలైనను।
వ్వారికి నెక్కుడక్కరపు వాసన లేదొకవేళ నుండినన్।

భారము మోయుగాడిదలభంగి జరింపుచు నాశ్రమధర్మముల్।
తీరునఁ బౌరుషంబడరఁ ద్రొంపున యుద్ధ మొనర్తు రొండొరుల్॥ 46

సీ॥ వ్యాజ్యమాడిన వాఁడు వనటగుందఁగ వచ్చి,
మనిమోఁకలఁ జక్కఁ రదినెడు వారు।
ఋణమిచ్చిన వాఁడు గోలపెట్టుచు నుండ,
చిప్పసవరి వకవక నవ్వువారు!
గీము గాలిన వాఁడు ఖేద మొందుచు నుండ,
పొంచి సొత్తులఁ సంగ్రహించువారు।
పనియున్న లేళబాబని వేడి యూఁ వెన్క,
విధవా యటంచును బిలుచువారు।

గీ॥ అంది వచ్చిన సిగయును సందకున్న।
గొంకు లేక కాళ్ళను బట్టుకొనెడు వారు।
కరము పలుగాకిముండల సరస చేరి।
స్వాతిశయమును చెప్పు వారచటి జనులు॥ 47

సీ॥ కొడుకు పెండ్లిని జేసికొను మంచూజింపము,
పేరమ్మకును వెలి వేసినాఁడు।
వేలకేఁగుచు నుండ విధి గోనదుర్రైన,
తంబుల శాయి నిఁదన్నినాఁడు।
నాకోర్కె దీర్పని కాక చేబోగము,
కమలాక్షి గేహంబుఁ గాల్చినాఁడు।
నేమాయి యనిపిల్వ కోమటి లక్ష్మాయి,
నీడ్చి చెంపలను వాయించినాఁడు॥

గీ॥ మొన్నతీండ్రాలకుంజనిమూసలిపోవు।
దమ్మహారలఁబెక్కండ్రఁదాకినాఁడ।
ననఁచుఁబ్రతిబాడబుఁడుభూపుడర్యకులుఁడు।
పాదజుఁడుపుల్కసుఁడుపగ్గెపల్కఁచుంద్రు॥ 48

సీ॥ ఫీజుతేదనుమాటవెత్తియొక్కటిగాని,
ప్లీడర్లువారికిజోడుగారు।
జీతంబులేదన్నజిన్నిమాటయెగాని,
జడ్జీలువారికిసములుగారు।
అధికారమొక్కటియబ్బదుగానినే,
జస్టీస్లువారికిసాటిగారు।
రాజ్యమేచందానపూజ్యమొక్కటిగాని,
భూపతుల్ వారికిఁబుసుడుగారు।

గీ॥ కాళ్లయుక్తిగవాదముల్ నడఁగునపుడు।
పరులకెంతేనితీర్పులువలుకునపుడు।
సుందరులమీఁదతమశక్తిఁజూపునపుడు।
సొంతతిన్నెపైకివిఁగూర్చుండునపుడు॥ 49

సీ. పతియింటిలోపలపాదఁబుప్పెట్టంగ
గాంచితిట్లకుపక్రమించువారు।
కలనకు హేతువైగవ్వలైసనుగాని,
పొల్లువల్కులప్రొద్దుపుచ్చువారు।
వేములదిగనాడిపిల్లిపైయెలుకపై,
బెట్టియుక్కులఁజావతిట్టువారు।

నగలు లేవనునట్టిమగని పైకిసుక చే?
కూర్చి బిడ్డలఁబట్టిగొట్టువారు।
గీ॥ ఒకరిమాటలనొకరితో నొనరచెప్పి।
వీరి వారికిజగడాలు పెట్టువారు।
పరులమర్యాదతలఁపక బావియొద్ద।
తమప్రతాపమాడెడువారుతరుణులచట॥ 50
గీ॥ వరుసచెంబుతప్పెలలనుబగులవేసి।
బిచ్చగాండ్రనువదితిట్టిబిడ్డలఁగడు।
గొట్టినటిచటి స్త్రీలకుఁగోపమార।
దావగింజంతయైనియునధిపవింటె॥ 51
చ॥ వరలెడువాఁడుగ్రామమునవన్నెకునెక్కఁగలాఁడుతల్పగన్।
బరవమువాఁడుచావఁగనువ్యాళెమునైనడివానికాంతయు।
ద్ధరమనుబెక్కువర్షములుతావతిజీవముఁగొంచునిట్టులం।
గరమువిభూతినొందెననఁగప్పులుకంచెలఁబొఱ్ఱవైచుచున్॥
క॥ అపత్తనంబుసందగు।
పాపంబులవ్రాయఁజిత్రుబదులుగఁజిత్రుం।
బాపంబువిచారింపఁగ।
శ్రీపతిపంచెరుముసమ్య స్పెషలధికారిన్॥ 53
వ॥ అప్పురంబున స్వర్ణలవణచ్ఛత్ర వస్త్రశస్త్రిక రుద్రాక్షపాద
రక్షాద్యఖిల వస్తుస్తోమ స్తేయ క్రియా చాతుర్యాసాది తాం
హాసమాజ్ఞానోనామేయా నంతాశాంతాకాంతా త్యం
తవర్ణనీయధ్వాంత పరిభావితకజ్జలఖంజన కాళిందీకృష్ణ సా

రతమాలహాలా హాలకాలమార్జాల బలాహకద్రోణ కాక
ప్రకర ప్రకాశుండును, ఆచ్ఛాదన విహారసమయాభీల కర
వాలవిదార్యమాణ బస్తోరభ్రనై చికీ శశకీ శశశాదనసారంగ
వృషభవకసృగాలబిడాల విట్చరేట్చర క్రకరప్రకరవ పూర్జని
తలోహితబిందుసందోహ సంపాన మత్తకాక గృధ్రకోలాహ
లబధరీకృత దిఙ్మండ లుండును, ప్రేష్యతర్జన గర్జన భర్జనస
ముజ్జితా సంతాపాతురధావన్నిఖిలాశా సమాగత వనీపకస
మూహుండును, ఆసేతుహిమాచల మధ్యాఖండ భూమండ
లస్థదివ్యభవ్య పుణ్యక్షేత్ర యాత్రాయాత సద్బాడబకేదా
రకాదంబినీ ఝంఝానిలుండును, హితామాత్య పురోహిత
దర్శకసేవక భారికనైష్కి కాంతర్వంశికశుక మనోరథవ్యర్థీ
కరణపూరణీ ధరణీరుహుండును, పిశునదుర్జన ఘాతుకవంచ
కధూర్తయధాజాత మితంపచమలిమ్లుచరక్షణదీక్షాబద్ధకం
కణుండును. విప్రకృతసుచరిత్రా నికర మనోవ్యధమాత్ర
దైనందిన క్షీణాయుర్ధన సంపద్విశేష చలిత స్వాంతుండును,
క్షుద్రవనితాక్షీణ వికటకటాక్షవీక్షణా శనిజత శరీరమహీధ
రుండును, తిరస్కారకుపితసకలసుకవినికరభీషణపరుషభాషావి
శేషశప్తుండును నీచానర్థో న్మత్తప్రలాపకలాప నిష్ఫలీకృతస
ర్వకాలసర్వావస్థుండును నగుదుర్మార్గుండను పేరుదుర్గుణంబుల
న్నియుమూర్తిభవించెనోయనవెలయుచుండు॥ 54

సీ. అఖిలదుర్గుణములకందివేసినచేయి,
యంహములకునూటాలమైనదుంప!

పరుల నుబీడించుపనికి పెట్టిన పేరు,
దొంగతనమునకుఁ దొల్లి వేల్పు।
పెంకుటిండ్లకు నగ్గిపేర్చడమున మేటి,
బఁడబూతులను బేర్వడిన పెద్ద।
విబుధులపాలిట వెలసిన రాకాసి,
పెండిండ్లు పడగొట్టుపీడ విధవ।

గీ. పుట్టినట్టిబిడ్డకుఁ బేరుపెట్టినవాఁడు।
తిన్నయింటికి వాసాల నెన్నువాఁడు।
జుట్టుజట్లకు ముడిపెట్టఁజూచువాఁడు।
కాఁడె దుర్మార్గనాముఁడు ధూర్తతలమున॥ 55

ఉ॥ జారులలోపలన్ ఘనుఁడసత్యపువాదులలోన పెద్దవల్।
చోరుల కెల్ల మేటి వటుజూదరగాండ్రకు నెల్ల సద్గురుం।
డారయ హంతకావళికి నాద్యుఁడు దుష్టులలోన రాజుడు।
బ్రష్టాకారులలోనఁ బేరుగలకూళ యతండు దలంపవల్పుడే॥ 56

ఉ॥ మెండుగ పారులం గెడపి మేదిని సత్యముఁ రూపుమాపి పె।
న్గొండలడాగి పాంథులను గొట్టి గృహంబుల నెల్ల నగ్గికిం।
బండువు సేసి రుష్టుల సెబాసని మెచ్చి ఘనంపుఁ జూడ్కులన్।
మిండలఁ బండలన్ గనియు వేషవహించె నతండు నీచుఁడే॥ 57

ఉ॥ గొట్టును దల్లిదండ్రులను గొంకక యిచ్చను కింత యేనియుం।
బెట్టును బీదసాదలను బేర్మిముడిపీడుచు ముప్పతిప్పలం।
దిట్టును దండిపండితుల దిక్కుమొగంబయి పెద్దపెట్టుగా।
మొట్టును సేవకాజనము మోదము దక్కుచు ఖేదమొందఁగన్॥

ఉ॥ ఎప్పుడుజీవహింసలకునేగునుదారుణపాపకర్ముఁడై।
ముప్పుఘటింపఁజేయుజనువాలలదాఁగినవారినేనియుం।
దప్పులులేకపోయిననుదప్పులుమోపుచుఁబుణ్యకాంతలన్।
గొప్పలువట్టియీడ్చుకడుకోపియతండుధరాతలంబునన్॥ 59

గీ॥ చూడవచ్చినచుట్టాలనాడువారి।
నింటనుంచి రేయిబి నొడలెల్లతడవి।
చాచిపుస్తెపూసలఁద్రెంచిసురనునమ్మ।
వాండ్రకిడుఁజూకలకుగొట్టివాఁడుమిపుల॥ 60

గీ॥ అన్నమోరామచంద్రాయటంచుఁదిరుగు।
వారిచేఁబన్నులనుగొంచుఁబైకమెల్ల।
యిచ్చకముఁజెప్పుధనికునికిచ్చివేయు।
కాకిఁగొట్టిగ్రద్దకువేయుకరణిధరణి॥ 61

గీ॥ తెలివిగలవారలేరైనదిగువనుండ।
నున్నతాసనమునకెక్కునోటలేక।
మత్తనాగపంచాస్యముల్ మహిఁదిరుగ।
చెట్టుకొనకొమ్మలకుఁగోతిచేరునట్లు॥ 62

క॥ పనిలేకపోయిననుదాఁ।
బనికల్పించుకొనిపోవుఁబ్రతిగృహమునకుం।
గనముకుగుడులనుజీలుపుఁ
జనవేపనిలేకపెక్కుసదనంబులకున్॥ 63

గీ॥ పుడమివారకాంతలుసొమ్ముపుచ్చుకొనుచు।
నియ్యలేదనివానినినేడిపింప।
వాఁడుసంసారసతులకుఁబైసయేని।
నియ్యకనెయిచ్చితినటంచునేడిపించు॥ 64

సీ॥ తనుదానుస్తుతియించుకొనుచుండునెవఁడన్న,
జుట్టనవ్రేలేనితట్టుఁదిరుగు।
భీదసాదలఁగాంచిపీడించునెవఁడన్న,
దృగ్యుగంబెవ్వానిదిక్కుఁగనును।
వనితలకడకల్లలనుబ్రేలునెవఁడన్న,
నలజింహ్వయెవ్వనియాఖ్యనెత్తు।
జూదానఁజేరుసంపాదించెనెవఁడన్న,
వక్షోబ్జమెవ్వానివైపుమరలు।

గీ॥ నెల్లదుర్గుణంబులకుఁబుట్టిల్లెవండ।
టన్నడెందమెవ్వానినేమెన్నఁబోవు।
నట్టిదుర్మార్గనామకుఁడీయవనిలోన।
నరుఁడుమాత్రుఁడేతలఁపవానరుఁడుగాని॥ 65

సీ॥ పుట్టెడుకల్లునీపొట్టఁబెట్టితినంచు,
బట్టనెత్తినుకతెమొట్టుచుండ।
బట్టినిఁబట్టిచంపఁగనెట్టిరోగంబు,
పుట్టెనీకనియొర్తుతిట్టుచుండఁ।

గట్టబట్టలు లేనిపట్టుల నేయుండుఁ,
బట్టనంచొక్క తెనెట్టుచుండఁ।
జుట్ట నిప్పిచ్చుటఁబుట్టఁబోదనియూష్పుఁ,
గట్టచేనొక లేమకొట్టుచుండ।

గీ॥ వాఁడు నిశ వేళలనుదొంగ వానిబోలెఁ।
గడుపికారులు సేయుచుఁ గాంతలలుక।
మొకము పైఁ జల్లు పేడనీళ్ళకలరితన।
యట్టివారేరు లేరంచుమిట్టిపడును॥ 66

సీ॥ మాయప్ప దెమ్మునీమచ్చమాయనటంచు,
నిరతంబుఁదిట్టనినీచుఁడొకఁడు।
మాయుసుఖదవిలిమడిసిపోమవటంచు,
దుమ్మెత్తిపోయనిధూర్తుఁడొకఁడు।
భార్యకునాకెడబాపితినీవింక,
మనుదువేయనట్టిమనుజుఁడొకఁడు।
నీవుగాల్చినఇండ్లునెగడలేదింతకు,
సరిలెమ్మనినయట్టిజనుఁడొకండు।

గీ॥ లేదువానిఁజూచినవేళపీడునందు
జననకాలమెట్టిదోగానిగనఁగరాదు।
ధరణిపతులైనమర్యాదఁదప్పినయెడ।
గుడ్డిగవ్వకుఁగొర్కగాకుఱ్ఱోణియుండు॥ 67

గీ॥ భువినినాఘూరితోత్తంసుఁడెవఁడటంచు।
నలువయుడుగవానినిఁజూపినాటనుండి
తర్జనీకరశాఖవ్రాతంబుగాక।
పరగలేకున్ననదిసేయుఁబాపమేమి॥ 68

గీ॥ ఉగ్గుపాలతోనీగోనాలుదయమయ్యె।
మొడ్డిదొడ్డిలోజెల్లెళ్ళుమొలచుమాడ్కి।
ప్రతిదినంబునవింతగఁబ్రబలసాగె।
బొమ్మజెముడులునానాటఁబొల్చుపగిది॥ 69

క॥ ఇమ్మహిదుర్మార్గుగుణచ।
యమ్ములఁగోనికొట్టితిట్టియడలు పరిచివన్।
హుమ్మనితనతలయెత్తును।
బొమ్మజెముడులుతెగనరకబొల్చకయున్నే॥ 70

ఉ॥ ఎప్పుడువచ్చునోయిలకునెప్పుడుగీములమంటపెట్టునో।
యెప్పుడుగొట్టునోమనలనెప్పుడువృద్ధులఁబట్టిచంపునో।
యెప్పుడుచెండునోశిశులనెప్పుడుగొడ్డులఁజావమోదునో
యిప్పురినుండలేమనుచునేడ్చెదరెంతయువానిబాధలన్॥ 71

గీ॥ శబరుఁడిలకించుపక్షులచయమువోలె।
బిల్లిఁబరికించునాఖులపిండుమాడ్కి।
విషధరముఁజూచుమండూకనికరమట్లు।
కలవరించుదుర్మార్గునిఁగాంచుజనము॥ 72

వ॥ ఇత్తెఱంగునఁ బ్రజలు వెఱపునొంద నిఖిలసద్గుణంబులు నిత
ని కైకొంగోలు పుట్టినవియాశ్చర్యమొంద ధూమకేతువు
ప్రకటమున చండఁబున రాజ్యంబు పూజ్యంబుగఁ బరిపాలింపు
చుండెనత్తరి ప్రతిసన్నిధానంబునకు గోభక్షకుని సమక్షంబు
నకు నరభక్షకుఁడు వ్రాలె ముష్టిఘాతమాత్ర మరణిత నానా
వృషజాతుండును, దండప్రహార పీడిత నిఖిల పుణ్యక్షేత్ర
యాత్రికలిత *ధరణీబృందారక బృందుండును, నిజకో
ధానల హావిర్భాగఘటిత సజ్జనప్రాణవిసరుండును, శశ్వద్దహ
నిత గృహారామనిచయుండును, స్వమాతృకామవిచ్ఛేదకుండు
ను, తిష్ఠన్మాత్రుండును నగు మక్ఫ్రీభయను విప్రుండుదయించె॥

మ॥ కనియెన్ లోహితనేత్రు ముష్కృతమనఃకంజాతసన్మిత్రు గ।
ర్ధనసంఘస్తుతిపాత్రు స్వాస్వయపరామోరత్నాకరోద్భూతస।
జ్జంభాస్వగ్భడబాగ్ని హేమాత్రుఁ బటుమశ్చారిత్రు నావిద్ధవా।
మానగాత్రుం దనమోములఘోరతరదుర్మార్గాభిదాపాత్రు నిన్॥

చ॥ హరిగుణశీలుఁ గూరిరవికశావనలోలున శేషపూజ్యశే।
ఖరగణకాలుఘోరతర కాననఖేలుమృషాలవాలుసం।
పరిచితకల్మజాలుగురుభాషితపావజనానుకూలుస।
బ్బురముగనాత్రుపాలుఁగని పొంగునఁబొంగెనునింగియంటగన్

సీ॥ క్షణములోమనునిభస్మము చేసినహరుని,
ఫాలనేత్రంబుగా పొడుగాంత।

కనకకశిపుఁ జీల్చికడునుగ్రమయియుండు,
నరహరిరూపునిన్న రయుగాత।
సురలెల్ల దెసలకుఁ బరువెత్తఁ జేసిన।
హాలాహలంబువిన్నే లఁగాత।
మహిషాసురునిజంపిబహుభీకరంబయిన।
శాంకరితేజంబుసాకుగాత।

గీ॥ మానుచుగోత్రులకడగొల్లయట్టులరచి
మొగపుఁదుంపరల్ వర్షంబుపోల్కి-పడఁగ।
బుడమినాశీర్వదించినుగ్ఘోష మొగము।
చేటగానొప్పుదుర్మార్గుచెంతిః లిచె॥ 76

క॥ వచ్చినభూసురుఁగనుగొని।
ముచ్చటకుమార్గుడపుడు మ్రొక్కులఁ బదివేల్।
చెచ్చెరవిడివిప్రాగ్రణి।
మెచ్చొటచుబాసివచ్చితీవిచ్చటికిన్ ॥ 77

గీ॥ కోటివరహాలనీయకుర్గుణధురీణ।
నిన్నుఁబోలెడుశుంఠనానిలయమునకు
వచ్చునేనేఁడమంగళవార్షిణమునుఁగ।
నాకుఁగాకన్యులకుప్పిలెల్లోకమందు॥ 78

క॥ మీమాటలుఁశూలంబులు।
మీమెట్టినయెడశ్మశానమ్మదినిమీయం।

ఘూర్ణములతోయములుకిటి।
స్తోమేడితకర్ధంబుఖుశుంతాధ్యతా॥ 79

శా॥ ఏమే వేశ్యగణంబునారసితి రేయేశిష్టులందిట్టినా।
రేమే కొంపలయందుఁజిచ్చిడితి రేమే చెర్వులంబూడ్చినా।
రేమే దారులకంపఁగొట్టితిరి, యేమే తోటలంబీకినా।
రాయా దుష్టవిదుష్టచేష్టలను భ్రష్టానాకుఁజెప్పంగదే॥ 80

వ॥ అని యిట్లు దుర్మార్గుండు విన్నవింప దుర్బోధితల నాడించి
తత్ప్రతాపంబు నిట్లని చెప్పందొడంగె॥ 81

సీ. బీదసాదలగాంచి వెలిమీకనివచించి,
లంచపుసొమ్ము గ్రహించినాఁడ।
ముందునాకన్న తాంబూలంబుఁగైకొన్న,
ఐప్రుచేతులఁబట్టివిరచినాఁడ।
బాలరండలగర్భపాతనంబును జేసి,
వారిభూములఁగొంచు బ్రబలినాఁడ।
క్షీటులపైనున్న పెండ్లిండ్లువడగొట్టి,
పూర్ణప్రతిష్టలఁబొందినాఁడ।

గీ. కడలిమొలనూలుగానున్న క్ష్మాతలంబు।
నందుబూతులలోఁ బేరుజెందినాఁడ।
తలలుమార్చుటలోనన్ను దాటువారు।
లెందులేరనిబిరుదము నొందినాఁడ॥ 82

సీ॥ కరకరమనునట్టిగారెలేనూరైన,
ఘనమొప్పఁజిటికిలోఁదినఁగనేర్తు।
బ్రాహ్మణార్థముమీద బ్రాహ్మణార్థంబును,
జెలఁగియొక్క దినానఁ జేయనేర్తు।
మాటిమాటికిని సంభావనల్ గొంటకుఁ,
గోటగోడలలీల దాటనేర్తు।
చెప్పినమాటను జెప్పకమూనాళ్ళ,
బద్ధంపుసాక్ష్యంబుపలుకనేర్తు।

గీ. కొంచెమూపిరియుండ లేదంచుఁబలికి।
పీనుఁగులఁబీనుఁగులమంటఁబెట్టనేర్తు।
విధవలకుఁదియ్యమాటలుఁ గథలుసెప్పి।
కరముబుజ్జమున్న గఁగొరగంగినేర్తు॥ 83

సీ॥ ముసలిముండలమీద దెసలఁజూపుటయున్న,
నల్లేరుపైబండినడకగాదె।
కనుపడతిరిపెగాండ్రనుదిట్టుటయటన్న,
నంబికొండయదండనంబుగాదె।
తప్పుసాక్ష్యముపల్కి ధనములాగుటయన్న,
షడ్రసోపేతభోజనముగాదె।
తడివస్త్రములతోడమెడలఁగోయుటయన్న,
జననముతోజనించినదిగాదె॥

క॥ ముక్కుపచ్చలారనిముద్దుపుత్త్రికలను।
వరుసవిక్రయించుటయున్న వ్రతముగాదె।
కుత్రమాటకుఁ జెవికోసికొనుటయున్న।
నిక్కమైనపూర్వాచారఫక్కిగాదె॥ 84

సీ॥ కమలాక్షికూతురికన్నెరికంబుకై,
తిమ్మాజిరావును దెచ్చుటందు।
రాజగోపాలుసర్వస్వంబుదొమ్మరి,
నాంచారిదేవికిప్పించుటందు।
పురుషోత్తరావాలిపుస్తెసెలెము దెంపి,
యింటిలోపలినుండియీడ్చుటందు।
చీకటితప్పుఁ జేసినవాజపేయుల,
తిమ్మినిండగుకడ్పుదింపుటందు॥

గీ॥ నాదురాయభారము నేర్పునాదుపూర్ణ।
మైనవ్యవహారచాకచక్యంబునాదు।
బాహుదండబలము నాదు పరమగుహ్య।
మైనమంత్రసాని తెలివిగానబడదె॥ 85

వ॥ ఇట్లు తనప్రతాపంబును బల్కి బాలకా నీశ్రేయోభిలాషిని గాన నీకుంగొన్నిధర్మంబుల మర్మంబులుపదేశించెద సమాహిత చిత్తుండవై వినుమనియిట్లనియె॥

సీ॥ నూనూగుమీసాలురానివానికినైనఁ,
గామశాస్త్రంబునుగఱపుచుండ్రు।

పైకంబుపోయినప్రాణంబుపోనను,
వానిలోభత్వంబుఁజూపుచుంద్రు।
సకలమాకర్షించిసన్న్యాసమిప్పించి,
సత్యవిరాగులసలుపుచుంద్రు।
పలుపన్నెలుంగలవ్యాధులనంటించి,
పరలోకమునకఁబైపంపుచుంద్రు॥

గీ॥ రవనిహారకాంతలుగాననట్టివారి।
కెపుషుపాదముల్ పిసుకుచునెలమిదట్టు।
ములనువ్రేయుచుభక్తిసేవలఁసలుపుచు।
కాలమునుబుచ్చుచుండుమాకర్గాళమిన్న॥ 87

ఉ॥ కొంపలుగాల్చుమీవిబుధకోటులదిట్టుచుబిట్టుమొట్టుమీ।
చెంపలువేయుమీపితనుజెంతలబోగమువారినుంచుమీ।
పెంపువహింపుమీప్రజలబిడ్డలగొడ్డులజావమోదుమీ।
కంపలుదార్లకడ్డముగగట్టుచుమర్త్యులదోచుకోజుమీ॥ 88

మ॥ పరదారాగమనంబుగోరిసతులంపల్లారుపీక్షింపుమా।
పరవాసంబునుజేరిసాదముబలేబాగంచుభక్షింపుమా।
పసులేనైనజనంగజూచిముదమొప్పన్ దారిశిక్షింపుమా।
పరసౌఖ్యంబులభించుదీనివలనన్ భావింపదుర్మార్గుడా॥ 89

శా॥ దారన్నెత్తినిబెట్టుకొంచుజనునిందాలోచించుచుదూషింపుమీ।
సారాచాయులదిట్టుదుర్మతపరులంజకొంగభూషింపుమీ।

వీకున్వారనబోకకుత్సితతతిన్వీక్షించిపోషింపుమీ।
దూరంబై చనుమీఫలంపుపనికిన్ దుర్మార్గచూడామణీ॥ 90

మ॥ కనుమీకూకలొసంగివారసతులన్గారాముచేనిచ్చలున్।
వినుమీసజ్జనదూషణంబుశ్రుతికిన్విందొప్పనేప్రొద్దునన్।
జనుమీకూడునునీళ్ళు లేకజనులంజక్కాడగాలెస్సగన్।
మనుమీనావచనంబుమీఁదగలుగున్మర్యాదదుర్మార్గుడా॥

క॥ పండితమండలిమెండుగ।
భండనమునబాధపెట్టివారిగృహములు।
ద్దండతమెరయఁగశిఖికిం।
బండువుసేసికడుపుబ్బపకపకనగుమా॥ 92

క॥ ఈవుగుడుపనిపదార్థము।
నీవసుధాస్థలిమరొక్కరేరైనగనం।
త్రోవంగనడ్డపరుపుము।
సూవృషమునుగడ్డియందుశునకముపగిదిన్॥ 93

గీ॥ నీకుదుర్మార్గనామంబునిజమటంచు।
ప్రజలుగుంపులుగూడుచుబలుకునటుల।
పలువిధములనేబోధించుపనులయందు
పట్టుబూనుమీనీపాడెకట్టుదాక॥ 94

ఆ॥ ఎక్కువగనుజెప్పనేలబల్కెదవిను।
మొక్కమాటలోననూరిశిష్య।

మంచిచెడ్డచెడ్డమంచిగా జేసిన।
నిన్ను తెండ్రిదిలనుదన్నె నండ్రు॥ 95
ఉ॥ ఎచ్చటకేఁగ నన్నిసుఖలేంద్రఖరావరకు త్రిశోత్తమా।
ప్రముచ్చిలియాకతాండ్రదోరమూర్ఖదుర్జనచక్రవర్తినీ।
చచ్చుటయెన్నడోగదరచక్కనినీతిలమాలకన్నులిం।
పెచ్చగజూతుమాయనుచునెల్లరుదీనవనేయునెంతునిక 96
వ॥ ఇట్లు దుర్బోధి పలుతెరంగుల నుపదేశించి స్వస్థానంబునకుం
జనియె నంత॥ 97
గీ॥ వాంతకులకునెన్నగవిమబ్బినట్లు।
దొంగలకుజీకువాలులుదొరకినట్లు।
కోతులకుమద్యపానంబుగూడినట్లు।
పుడమిదుర్మార్గునకుగురుబోధమబ్బె॥ 98
గీ॥ తొల్లికన్న వేయిమడుగులల్లరిగను।
వాడురాజ్యంబుసేయంగప్రజలుతగ్గు।
ణములబొందిరిమందుకైనసుకమాన్య।
డెందము లేదుదీనపలకుసందియంబు॥ 99
క॥ ఏజాడ రేడునడచును।
యాజాడనెలోకముండునారయగయథా।
రాజాతథాప్రజాయను।
భూజనవాదంబుపొల్లుపోవునెయధిప॥ 100
వ॥ అత్తరి॥ 101

చ॥ తనభువిజూడగాండ్రకునుదంభుఁ గిత్తురటంచులచ్చియుం।
దనుహృదయంబులోనెపుడుదాచుచునుండురటంచువాణియుం
దనుపనిలేనికార్యములధారనుబోయుదురంచుశక్తియుం।
గినియుచుభర్తలన్వదలిఖేదములన్వనభూమికేగగాన్॥ 102

గీ॥ కమలములులేనిసారసాకరమువ్రోలె।
జీవనములేనిస్రోతస్వినీవిధాన।
తమపడంతులులేకున్నతమగృహంబు।
లున్నకన్నారగాంచినిట్టూర్పులెగయ॥ 103

గీ॥ శక్తిశక్తియంచుచంద్రచూడామణి।
లచ్చిలచ్చియంచులచ్చిమగఁడు।
వాణివాణియంచువనజాసనుండును।
వగలతెగలమిగులపొగలిరపుడు॥ 104

గీ॥ పడతిలేనియట్టిపండువుదండువు।
చానలేనియట్టిశయ్యకొయ్య।
పొలతిలేనియట్టిభోగంబురోగంబు।
భామలేనియట్టిగీముపాము॥ 105

క॥ అనిపెక్కుతెరంగులనా।
వనజాసనవాసుదేవభర్గులుచింతా।
వనధిమునిగికొంతదడువు।
మనమునదలపోసిగహనమార్గములరయిన్॥ 106

క॥ ఒక్కరుపోయినజాడను।
రొక్కరెఱుంగకచనజనునువిదానన్నం।
చిక్కొనరించిచనదగునె।
యక్కటరావేయనియెడియార్తస్వరమున్॥ 107

క॥ వినినలువనాపగిదియీ।
జనుడెవడోకాంతకొరకునంతాపమునన్।
వనములదిరిగెడుచూచెద।
ననిదవ్వులకేగియిట్టులనియెంబ్రీతిన్॥ 108

ఆ॥ అయ్యమీరలెవ్వరడవిలోజరియింప।
నేలనన్నుబోలిజాలినొంది।
యనినతనకుమూఢుడనియెంచివెన్నుండు।
గోలబెట్టనేలకోడుకుగుఱ్ఱ॥ 109

ఆ॥ నాకుసుందరాంగినీకుప్రేముడితల్లి।
కడలిమూలినన్నుకడకుద్రోచి।
యిచ్చవచ్చినట్టులేగెదానెచటికో।
గానవడతికొరకుకదలినాడ॥ 110

వ॥ అనిన బ్రహ్మయిట్లనియె॥ 111

గీ॥ పడితికై చింతనొందునిర్భాగ్యశ్రుతికి।
తల్లివార్తలువినబడితిగనివెతల।
పాలొనర్చెసాగరమీదువానివీచి।
కలరుదెంచిముంచుపగిదికట్టకట్ట॥ 112

వ॥ ఇట్లు పరమేష్ఠిపెద్దయుం బొగిడ్డునేలంబడి చింతిలుచుండ చే తులుతేపనెత్తి బాలా యేలాయీాలీలగోలబెట్టెదవు చీకటు లుపోయి వెన్నెలలురాకయుండునే మాన మిరువురముకలిసి లక్ష్మీసరస్వతుల నారయుదము రమ్మని వెన్నుండుసుతునితో డ నయ్యనం బై యీాశాన్యాభిముఖంబుగా జనుచెడ॥ 113

గీ॥ అమలగుణశీలభక్తదయాలవాల।
మహితరిపుజాలమధుకరమంజువాల।
యేలయీాలీలవల్లిమలబాలరాడు।
కరుణయనిచింతిలుశివుండుగానవయ్యె॥ 114

క॥ అత్తరిఁజిత్తజజనకుడు।
చిత్తజవైరినిగనుగొని క్షేమముబావా।
తత్తడిలేకనెవచ్చితి।
విత్తెరగునహేతువేమియేర్పడచెప్పుమా॥ 115

క॥ అనవినిపురారిహరినిం।
గనినీసైదోడుజాడగానకయిట్లే।
వనభూములకేతెంచితి।
జననాంతరకర్మమిట్లుసల్పెనుబావా॥ 116

గీ॥ ముద్దుగుమ్మలేనవ్వులమోముజాడ।
కున్ననీమేనుపైయాసనున్నసువ్వె।
కూడునీళ్ళునులేకనేచేడెనెమకి।
దవులువ్యసనంబుచేపాండుతనుడనైతి॥ 117

వ॥ అనినమురారి యిట్లనియె॥ 118

గీ॥ అయ్యమేము నుభామలసరయువచ్చి।
నారమీకానగానము వారినెందు।
మూడువంక్తులలిపియుండెము వ్వారకును।
నొక్కచందానలేలేందుఖక్కలేల॥ 119

క॥ అనిహరిహరునిక్రైతము।
తనవెంటనిడుకొనియేగెదారుణముగుకా।
వనసీమలకుంగాంతా।
గనకంబులపైనెవరికిగలుగవువలపుల్॥ 120

వ॥ ఇట్లుజనిచనివారు॥ 121

ఉ॥ చంకనుదుష్టుకక్షానుభుజంబునసల్లనిపెద్దకంబళిన్।
పొంకముమీరనెత్తిపయిముంతనుబట్టిధరించిజొంపమున్।
చింకిరిచెప్పులందొడిగిచెప్పకనేతనగొల్లజాతిని।
శ్శంకముగాంబ్రకాశమునుసల్పెడిగొల్లనిగాంచిరొక్కచోన్॥

క॥ కనివానిపజ్జకుంజని।
వనమువనెందైనగంపెవనితాత్రితయం।
బునునావుడుగొల్లపలికె।
వనితలగినితలనుగానపలుకకుడింకన్॥ 123

క॥ అల్లదెబాగుగచూడుడు।
నల్లనిమానులుగనపడునాచేచాయన్।

మెల్లగనల్లనియొజ్జని।
తెల్లనిదయ్యాలుమూఁడుతిరుగుచునుండున్॥ 124

సీ॥ అవిగనినయంతమాఁగుండెలదరుచుండు।
బమ్మరాకాసులేమొవమాపాలబడియె।
నీళ్ళనిప్పులేకనేపెక్కునెలలనుండి।
కాపురంబీడనేయుండెకర్మమకట॥ 125

క॥ ఆపలుకులుచాఁజెవినిడి।
శ్రీపతిముదమొందిధాతశితికంఠులతోఁ।
వాఁపోవజనదికయువిన।
మీఁవంబునకేగిగాంచెమొలతలనచటన్॥ 126

గీ॥ తావులనుబాసికీర్తులబాలుజేసి।
యడవులనుడాసిరావంగన్యాయమొకొ।
చండికారమాభారతీసాధ్వులార।
పుణ్యవతులారయమరాగ్రగణ్యలార॥ 127

క॥ ఇటులంబెక్కుతెరంగుల।
కుటిలాలకలారయంచుగోలంబెట్టం।
గటగటయొకింతయుశ్రవణ।
పుటస్థలినిజేర్పరయ్యుముప్వఃసుదతుల్॥ 128

క॥ • అప్పుడుధాతసతినిముద।
మెప్పంగనిపల్కెనిద్దియువిదలకగునే।

చప్పుడుచేయకరమ్మిక।
తప్పులగునలువురులోనతరలకయున్న॥ 129॥

వ॥ అనిన సరస్వతి యిట్లనియె॥ 130

ఆ॥ చాలుచాలుమీవచనములురవ్వంత।
కట్టిపెట్టుడింకగుట్టులేల।
బట్టబయలుగాదెప్రజలచిత్తంబులో।
మెలగనింకనాదుతలముకాదు॥ 131

క॥ తానభ్యసించినచదువు।
దానంబీయంగలేకతనశిష్యులకున్।
గానన్గుహావిత్తముంచం।
దానందనకుక్షిలోనదాచునకుడోగిన్॥ 132

వ॥ అంతరమాకాంత యిట్లనియె॥ 133

గీ॥ కుక్షితతతికిదుర్జనగోత్రములకు।
ద్యూతపరులకుసన్మార్గదూరులకును।
పొమ్ముటాలులకిత్తురుపుడమినన్ను।
వారిగేముల వానంబుపడయలేను॥ 134

క॥ పదపడివరుగనిదుర్గా।
సుదతీమణితానుబల్కెక్షోణీస్థలినే।
బ్రతుకంగలేనుధూర్తులు।
మదమునకుపాకార్యపజ్కిమానుపుమనుచున్॥ 135

గీ॥ జగతిదుర్మార్గనామముండుచచ్చుదాక।
యిచటనేయుందుమందురానేలననిన।
దేవతలుమువ్వురచ్చటపావనముగు।
తపముసేయసాగిరిముందుదారిలేమి॥ 136

వ॥ ఇత్తెరంగున కాలవశంబున హరిహరబ్రహ్మలుసైతము దుర్మార్గుండు విగతజీవుండయి ప్రజలుసన్మార్గవర్తనులగు పర్యంతంబెన్నరానియుగంగదల ననుభవించిరి కాదే యేనుగువేట బడి కొట్టుకొనిపోవుచుండ నక్క పాటిరేవడిగిన చందంబుగానుండె నీమాటలు గాన నికవగపుడుగుమని యూరడించునవివేకి హరిశ్చందనరేంద్రుండు తరువాతవృత్తాంతంబడిగిన నతండిట్లనియె॥ 137

గీ॥ ధరనుదుర్మార్గునకునెప్పుడగుననంగ।
గలడుగాదిలిసంగడికాడుకుమతి।
నాగశ్వాసములనుమించునమ్మకంబు।
చేతదనరుచుండునుదనచేతవలన॥ 138

వ॥ ఒక్కనాడు దుర్మార్గుండు తనసంగడికానితో గూఢధుత్తూరాస్ఫోటావల్లు జాజి గన్ధికో గ గన్ధానిర్గుణ్డా శ్వదంష్ట్రావహ్నిసంజ్ఞికా భృంగరాజవిషాణీ కాకాంగీ వత్సాదనీ సంస్పర్శదుః స్పర్శహ్యాఘ్రఘుపుచ్ఛవజ్రద్రుమప్రముఖ నానావిధద్రుమ విరాజితంబును దంశమూషికా కృకలాసోద్దనా భకద్దజలూకాశూకకీటకర్కరేటు సక్ప్రత్సజగణ్డోలి భృంగారిజ్యో

తిరింగణ ముఖ్యజంతు సంతాన సంకులంబును నగువనంబు
నకుంజని యందలితరు విశేషంబుల నెచ్చెలికిఁ జూపుచునిట్టు
లనియె॥ 139

గీ॥ ప్రసవమకరందమానంగభసలపఙ్క్తి।
ప్రాలిమఱమలమాడుచునేలమీఁద।
బడుటకతమునమ్మెదల్ప్రచురనీల।
దేహకాంతులదనరుటదెలియనయ్యె॥ 140

ఉ॥ దానిసుసౌరభంబుబలెదానిదళాంచితశాఖికాప్రభల్।
దానిసుమాళివృద్ధియుహదానిమధుస్రవతత్ఫలంబులుఁ।
దానివిశాలమూలములుధారుణినేఱెఱలందుగల్గున।
ద్ధానికసింతచెట్టునుసదాతలపోయరెచూడునెచ్చెలీ॥ 141

గీ॥ కాలుఁబెట్టినయంతనేతేలుకుట్టి।
నట్టిపోలికసలుపుచునహాహాయిచట।
నెందుజూచినకౌతుకమొందజేయు।
స్వాదుకష్టకతరుపులుసంగడీడ॥ 142

గీ॥ వీకనున్మత్తతరుపులయాకులెలమి।
తెచ్చిగిద్దెడురసమునుదీసిత్రావ।
తెనడుఘుననామమంతసార్థకముగాక।
మనుజునున్మత్తుడై క్షణమరణమొందు॥ 143

క॥ మిక్కిలిజారత్వంబున।
లెక్కింపగకోటగోడలీలగదాటన్।

గ్రక్కున గాయముగాఁగను।
జక్కఁగ దానికిఁ కిసింతసహాకారిగదా॥ 144

సీ॥ దొంగతనమును గావింప దొంగదొంగ।
యనుచు నింటివారెల్లఁ గసరుచు బరచు।
ఘనము గలవారివాలిటికల్పతరువు।
గానె యూబొమ్మ జెమ్ముడుఁ బగంబెఱుమత్తి॥ 145

గీ॥ దేని కాయలవలననుదిట్లుమనము।
చవితిపండుగదినమ్ముం శభువినితిరు।
మట్టిపల్లేరుమానులనరసినావె।
నాడుగాదిలి చెలికాడ మోదమెసఁగ॥ 146

క॥ సీతాశోకచిలుకలతి।
చేతఃకౌతుకముతోడ జెలఁగుచునుండుం।
ఖ్యాతిమయి నిగుగుచుండిన।
భూతలమున వీనిపొంకునాగడఃస్వశనే॥ 147

వ॥ ఇట్లు వనవిశేషవీక్షణసౌఖ్యాబ్ధినోలలాడు సమయంబున॥ 148

చ॥ తెనతను కాంతిదక్కులకుదగ్గఁ నల్లనిచాయసీయగా।
దనతను గంధమింతయును దాకిన నారలుచచ్చుచుండగా।
దనచను దోయివిశ్వమును తద్దయశుభ్రము సేయుచుండగా।
జను చెలినోర్తు గచ్ఛపాదచాటువగాంచి బలేబలేయనె। 149

సీ॥ ఉల్లిపనములో జోరిగ యుండుఫక్కి।
పరగనత్తలకొలనులో బకముభంగి।

కాకినుండుసృగాలముకరణినలరి।
యవ్వనవునమున్నకుకూపినరసియపుడు॥ 150

గీ॥ గుటకలనుమింగిరొట్టెలకొట్లకొలది।
వేసిరోమముల్ భూదారవిధమునిక్క।
పొడవగాబ్రత్తికాయలబోలుకనుల।
రెప్పవేయకవీక్షించెనప్పడెలమి॥ 151

గీ॥ గార్ధభముస్వరమునకన్నకడిదివేయి।
రెట్లధికముగావిన్నైనెనట్లుదోచె।
మున్ను నాచేటచెవులకునెన్న దీని।
స్వరముకాబోలునోంకారచారమేమొ॥ 152

ఆ॥ దీనిబల్కరింపదిట్టునొక్కొట్టునో।
మెట్టునొసిగచేతబట్టుకొంచు।
నెగసితన్ను నొకడుపగచేతలాగును!
రక్కనొకను పెట్టునిక్కమిపుడు॥ 153

సీ॥ కలికిమొగంబుశాఖామృగంబునుబోలు,
చెలియకన్నులనూడిబిలము నేలు।
కోమలికంఠంబుకొక్కెరలనుదూరు,
చెలిచన్నులుంబొరకాయలనుగేరు।
కాంతదేహముచాయకరిదూపమునుమించు,
మెలతకరములుకట్టెలనుబెంచు।

చేడియమధ్యంబుచింత మొద్దనుగ్రోయు,
ముదితస్వరముఖరములనుద్రోయు॥

॥ ఔరయీయందమీచందమవనివదవ।
నాటిక్రొత్తవిధవకైననాస్తికాదె।
వగ్గుబమ్మచేసగునెయీపగిదిదలప।
యమునిచేననితలఁచెదనతివసృష్టి॥ 154

॥ చానగాదిదిజయుకోలవానగాని।
యింతిగాదిదియిడుములదొంతిగాని।
యన్నగాదిదివలకాటిమన్నగాని।
కొమ్మగాదిదిబోడిపెద్దమ్మగాని॥ 155

॥ చెలియవదనమిత్తడిసిబ్బిచెన్నుదన్ను।
సఖియకనుబొమల్ధ్వజములసౌరుగేఁ।
మెలతమైచాయబొగ్గులమించునెంచు।
నువిదనడకగాడిదనడయొప్పుదెప్పు॥ 156

॥ నడకలుఁపిచుకలబోలును।
నొడలన్ననుదుమ్మకట్టిలోయననెన్నం।
నడుమదిజెప్పందరమే।
గడుపెద్దగుమద్దిరోలుంకైవడిదోచుఁ। 157

వ॥ ఇట్లాకురూపి సౌందర్యం బభివర్ణింపుచు పిసితఖండంబుఁడా
సినగృధ్రరాజముం బోలెదాని వజ్జకుడాసి॥ 158

గీ॥ ఇంతిపేరేమికాపురంబేడననఁగ।
గొబ్బిపిప్పివన్ను లజిగిగ్రుమ్మరిలఁగ।
బిందువులువర్షధారలై వెడలరాల।
యేఱులై పారలెన్నుగుడ్లెఱ్ఱజేసి॥ 159

క॥ తిట్టివతిట్టునుడిట్టుక।
తిట్టెనుబారలనుజాపితిన్నగపదివేల్।
చట్టువలుబ్రద్దలైచన।
గట్టాకాముకులకెందుగలుగవృఘనముల్॥ 160

వ॥ అప్పుడుదుర్మార్గుండిట్లనియె॥ 161

గీ॥ వడతినాలాయిచిత్తంబుబట్టియీడ్చె।
నీదుచూపుబరికొంతనెమ్మిలేక।
బిగ్రబిగిసిచచ్చినబత్తపిల్లబయిట।
కటికచండాలుఁడీడ్చెడికరణినెకట॥ 162

ఉ॥ కోకిలఖించుమైయొరపుకుక్కుటజాలమునొంచుకోపముల్।
జీకటిపెంచుహాసమునుజిన్నెలుసన్నెలుజూడబ్రాణముల్।
పీకుచునుండెనెప్పుడునుబిగ్గగవుంగలియేపుజూపుమీ।
కాకనువీడుమీపడతిగాళ్ళనుగొట్టినమొద్దువైనడిక్॥ 163

గీ॥ అతివనినుజూచినంతనెయాతురమని।
పొరలుపొరలుగాతోసంబుపుట్టెనుక్క।
పెట్టుగామాటిమాటికివిసుగులేక।
కరముకడుపునొప్పితెరలకరణిధరణి॥ 164

గీ॥ నీదురూపంబుగాంచిననిమిసమునఁదె।
తెరవనీయభిధానంబుదెలియదయ్యె।
తిమ్మనిముఖంబుఁజూచినత్రుటికలోనె।
వెఱ్ఱివిధవయైననుదానిపేరుగనడె॥ 165

గీ॥ ఇటులఁ బాధించుదుర్గానునీసులెత్త।
మాతులకుచేతులనుసాచిముఱితయపుడు।
బోర్లఁబడఁద్రోచెబాపురెపోతినంచు।
లెక్కఁబోక్కెడురక్తంబుఁగక్కునట్లు॥ 166

క॥ ఈలీలన్నేలఁబడియు।
దాలేచిమెయితుడుచుకొనితరుణీరమ్మా।
ప్రేమలకనికాముకన్యకు।
లోలజ్జాయనుబుధోక్తిధ్రువముగనయ్యెన్॥ 167

గీ॥ ఇలనుశ్లేష్మంబులోఁబడ్డయీగరీతిఁ।
బరగఁగుడితిలోపలఁబడ్డబల్లిభాతిఁ।
గాలిబోనులోపలఁబడ్డగిరికభంగి।
నావిదనీయందలితమినేనుంటినిపుడు॥ 168

గీ॥ వెఱ్ఱిపట్టినశ్వానంబువిధినిభూత।
మావహించినమనుజునిరీతిఁబండు।
నిప్పుఁద్రొక్కినప్లవగముచొప్పునిట్టు।
లున్ననామీఁదఁగారుణ్యముంచవేల॥ 169

గీ॥ పొలఁతి నేశేడుపువ్వులఁబోలు నీవు
దృష్టి చేతనన్ను నొకింతఁ దేరి చూడఁ
గంటివేని నేకాలంబు నింట నుండు
పాడిబర్రెవగిది చూచువాఁడ నిన్ను॥ 170

క॥ నిన్ను మహామూర్ఖపగిది
నెన్నఁగఁ జూచుచు నవిరళప్రేమలో నీకన్
సన్నుతులఁ గుచు నుందును
దిన్నఁగ నను చెప్పు క్రింది తేలు విధమునన్॥ 171

గీ॥ ఇట్టు ప్రార్థింపఁ బెడచెవిఁ బెట్టి యతివ
పక్షిచందానఁ బఱువెత్తి పాడునూతి
లోపల నుదాగియుండ లోలోన దుఃఖ
పడుచు దుర్మార్గుఁడు వెడలెఁ బడఁతికొఱకు॥ 172

ఉ॥ పొలుపగు తుమ్మలార నిమ్ముష్టిమహీజములార దీర్ఘపి
చ్ఛిలతరులార గోక్షురకచిత్రకతూదములార సారఫే
నిలమదనార్కపర్ణగుడనింబములార వరాకి మీరు నీ
డలఁగని డాగియున్న యెడ డాయక చెప్పరె మీకు మ్రొక్కెదన్

సీ॥ సూచీబిలముఁ బోలు సొగసుఁ గన్నులదాని,
వీక్షించినారె జోరీగలార
గార్దభముల దూరు గమన వైఖరి దానిఁ,
బరికించినారె కుక్కురములార

కటిభాగ్గులను గేరుకాయదీప్తులదాని,
వీక్షించితిరె కాకవితతులార।
దధిభాండమునఁబోలుతలనెరిసినదానిఁ,
జెలఁగి కాంచితిరె కౌశికములార॥

గీ॥ పికుఁ మెకములు కొక్కులు కొక్కెరాయు।
వాకణంబులు క్రౌంకీంచీకువాలు।
దివ్వెయార్పులు కూకటు గువ్వలార।
వెలఁదిఁగాంచరె యోపిల్లిపిల్లలార॥ 174

చ॥ అలమటఁ బారికిందపిలి హా సతి హా సతి యంచ రణ్యమున్।
గలయఁ జరించి కాకముల గద్దల నీక్రియ వేడి వేడి బి।
ట్టలుఁగున దేవుఁడా యనుచు నెంతయుఁ బెద్దఁగ గొంతు నెత్తి వా।
డిలవిలపించె నశ్రుకణమేఘులు గాఁ బ్రవహింప నత్తరిన్॥ 175

గీ॥ అతివ నీకంపు నాకింపటంచుఁ జేరి।
నట్టిసన్నిడ బాయుట న్యాయమానె।
నీవిఁక నురాక యున్న నీనిముషమునఁ।
చానఁ గొంతు పిసుకుకొని చచ్చువాఁడ॥ 176

చ॥ అనియనివార్యమానమదనానలతప్తశరీరుఁడై మనం।
బునఁగల దుఃఖభారమునఁ బొక్కుచు దిక్కులనెల్లఁ జూచుచున్
వసమునఁ గాంతగానమి శవంబువిధంబున వాలి మూర్ఛలొం।
గసనను కాళికాపదలు గాక సుఖంబులు గల్గఁబోవునే॥ 177

గీ॥ ఇటుల దుర్మార్గభూమీశుఁడిలను వాఁడు।
నేమిదో చకకుమతి దా నేగిపోరి।
వర్గములకీయుగంతంబు బయలుపఱప।
శుంఠలు విధవలఁ నుజనిచూచి వానిఁ॥ 178

సీ॥ భూతంబుపట్టెనీపుత్రుఁ బాధమునకంచు,
దయ్యాలధర్మాలు తెన్నో పలికె।
వాటంబు హెచ్చెనీపాటచ్చరునకంచు,
వైద్యాలవంగయ్య వరుసనుడివె।
గ్రహములు చాలవితూరితునకటంచు।
జోస్యులసుందయ్య సారిదచెప్పె।
చప్పఁగాఁ జచ్చెనీశగణోత్తముఁడంచు,
శవములశంభన్న సాటె పడిగ॥

గీ॥ నప్పుడెల్లమ్మగారిపుల్లమ్ముయింటి।
యాయానిట్టిరు గ్గతి చేతఁబోయెననియె।
కాదునయమాయెమావిస్సిగాడికప్పు।
డంచుసూరక్కగారిసుబ్బక్క పలికె॥ 179

గీ॥ అపుడువింతలమారవీరమ్మగారు।
కారణంబును సుమతిని జేరియడిగి।
తెలిసికొని కురూపినెమకి తెచ్చెరాజు।
నెపుటఁబెట్టంగ లేచి వాఁడిట్టులనియె॥ 180

చ॥ ఖరుఁడు నిశాతబాణముల మాటికి మాటికి గ్రుచ్చె నావిభా।
కరుఁడు కరంబు నాతపముగా యఁగఁ జొచ్చె నరిష్ట గృధ్రజా।
తరవము లెల్ల దిక్కుల ఘనదారుణమై కడు హెచ్చె నీదు సుం।
దరవదనున్ జూడ నాకిపుడు తప్పని మృత్యువు వచ్చె భామినీ॥ 181

సీ॥ ఈరీతిఁ బ్రార్థింపఁ ఇష్టంపడక యున్న,
కాంతను గడును గంగమ్మగారు।
చాడీల సాత్వాని శాంతాఫలము గారు।
తలగొట్ల మారి కాంతమ్మగారు।
జగడాల జంగమ జనుజానికమ గారు,
చక్కల్ల మారి హాజమ్మగారు।
మొదలైన విధవలు మోహవాక్యము లాడి,
మెడలు విరిచి యొడంబడఁగఁ జేసి॥

గీ॥ పరిణయముహూర్తము ధ్రువం పఱచి పెండ్లి।
పనులపటఁ జేయఁగడఁగి రిబ్రహ్మ పెండ్లి।
ముడులు పెట్టఁ ద్రెంపఁగ స్త్రీలముండలనుగఁ।
గొందఱి నొనరించెను గాదె క్షోణియందు॥ 182

క॥ ఆపెండ్లికి భూదివిజులు।
రూపాజీవలు దెసలను మ్రోతలు సెలఁగన్।
బాపురె యనఁగన్ వచ్చిరి।
బాపల నీగల గణికలపల యునెపిలువన్ 183

సీ॥ పెట్టినఁ బెండ్లియుఁ బెట్టకుండిన శ్రాద్ధ,
మవిదయనిర్దయ యననెడివారు!
కాసుతక్కువనీయఁ గోపానఁ బచ్చితో,
రణములఁ ద్రెంపుచుఁ బ్రబలువారు।
మొదటితాంబూలంబు మిట్టలేదంచుదో,
మ్రిదపయుద్ధమునోట మెదవువారు।
మాయూరికెప్పుడు మామూలు శ్వేతంబు,
సంభావనయటంచుఁ జాటువారు॥
గీ॥ తాతముత్తాతల చెమటఁ బాతగిలిన।
రోతశాలువంసమున నారూఢివేసి।
శాస్త్రిభిదలనువచ్చి రచ్చటికి వేడ్క।
వారములలోనమంగళవారరీతి॥ 184
ఉ॥ తట్టెడుబూది పెట్టి తనతాతల శాలువు బోడిబుఱ్ఱకుం।
జుట్టికకు ద్రతిన్ జనులుఁ జూచు తెరంగ సనంగ వస్త్రిమున్।
గట్టివిచక్షణుండువలె గంధముపొంకముమీరఁ జంకలో।
బెట్టిముదంబుతోడఁ బృథివీసురుఁ డొక్కఁడు వచ్చె నత్తరిన్॥186
గీ॥ ఎలమిఁ బుంశ్చలీసుతులు శిష్యులయి తన్ను।
గురువటంచును గొనియాడ గరువుమెప్ప।
లేచి సంభావనకుఁ గేలుఁ జాచె నప్పు
డఖిలదుర్గుణస్థానిపేరావధాని॥ 186
గీ॥ బ్రాహ్మణులకు నొసంగుసంభావనంబు।

వ్యర్థమైనవ్యయము వెలపడఁతులకును।
ప్రేమనిచ్చినఫలదముపీంద్రఁబిలుత।
మంచుఁబెద్దలు వేశ్యలనాడమనఁగ॥ 187

సీ॥ వ్రణములకీగలు ప్రాలఁదోలుచొకర్తు,
లయలేక చేటతాళంబువైవ।
లంకెపుగాజునుగొంకకనములుచుఁ,
బణ్యాంగనయొకర్తె పాటఁబాడఁ।
గంటిపుసులనుమేల్కట్టుచేఁదుడుచుచు,
వెఱ్ఱిచూపులనొర్తు విఱ్ఱిచూడఁ।
బాదంబుతంటిచేఁబడుచులేచుచొకర్తుఁ,
శివముగొన్న విధానఁజిందులాడ।

గీ॥ మ్రొక్కువలెరూప్యమాయంగముసలివాన్య।
గాడుతమపేరుఁజనుపుచుగంతువైవ।
సీతవండ్లునునమలినకోతులవలెఁ
బండ్లనికిలించినగిరిసభాసదులట॥ 188

సీ॥ నాచాయవీక్షించియీచానదండంబు,
పెట్టలేదంచునుఁబేలెనొకఁడు।
ముందుగానారూప్యమిందుఁజదువలేదు,
పట్టువట్టెదనంచువాగెనొకఁడు,
మొన్ననూరేగునప్పుడుగుమ్మమునుదాటి,
నిలువఁబడిరటంచుఁబలికెనొకఁడు।

వీండ్రయింటికిరాత్రి వేళ్ళఁగామార్యాద,
చేయనే లేదంచుఁజెప్పె నొకఁడు।

సీ॥ తలకుఁబోగరెక్కఁగాపుఁదప్పకొక్క।
తేపతలయింటినంగానితీరవన్ని।
రోగములటంచువిటజాతియూహిఁజేసి।
గుడగుడాలోచనముఁజేయఁగడఁగెనపుడు॥ 189

సీ॥ గణికనృత్యంబుముగియనాక్షణమునందె।
పురముఁజేరంగమనముత్తరము నొంద।
మానినీమణితోడదుర్మార్గుఁడపుడు।
బంధువర్గంబు వెంటరాబయలు వెడలె॥ 190

క॥ అతడటుబోవుచునుండగ।
క్షితినొక వైఖానసుండుజీలులతట్టం।
గుతుకంబుననెత్తినిడుకొని।
వెతవచ్చునటుచువచించువిధమునవచ్చెఁ॥ 191

క॥ అంగనతోగవగూడిన।
చెంగిలిదుర్మార్గురాకవినిపురజనులు।
పొంగుచుమూగిరిచుట్టును।
మొంగిలియాడనకునీగలేతెంచుక్రియఁ॥ 192

శా॥ చేరన్వచ్చిరిమొంటిగోడకడకుఁశీఘ్రంబదుర్మార్గునిఁ।
మూరిరాగోసరచక్రవర్తినిఖిలుఁగోరాజవైవస్వతుం।

ఘోరాకారువిరూపుకుత్సితమతిఁగుంజాంతనంచూచునిఁ।
దారాయుక్తునిజూడగానుయువతుల్ తండోపతండంబులై॥

గీ॥ కొట్టికొట్టకబిడకలగొంతియోర్తు।
తిట్టితిట్టకమగనినితేరవయోర్తు।
పట్టిపట్టకద్వారంబుపడతియోర్తు।
కాంతతోనున్నదుర్మార్గుగాంచిరపుడు॥ 194

గీ॥ మొండిగోడపైనిలిచినముదితయొకతె।
పాడుదొడ్డిలోనుండినపడతియొకతె।
బొమ్మజెముడులకడనున్నపొలతియొకతె।
సుదతితోనున్నదుర్మార్గుజూచిరపుడు॥ 195

ఉ॥ కట్టినపుట్టమూడజెయిగాజులమోతలుపిక్కటిల్లగా।
బిట్టురయంబునంజనగ్రేముడికాంతలునవ్వుటాలకుం।
జుట్టుపసంక్తినువ్విసను జావగమోదినపేడముద్దచే।
గొట్టినతిట్టినంగనదుగోమలియొక్కతెదానునివ్వెరన్॥ 196

క॥ రవికుసుమాంబకయొక్కతె।
యువనిందుర్మార్గుమీదనంబకసుమముల్।
మివులంగాబరపెనునీ।
భవనంబురవికుసుమములపాలౌనసుచున్॥ 197

చ॥ కనుగొనవచ్చిదంపతులగామినియొక్కతెమత్తురాలుగా।
పునవెదజల్లెదాగనకపుష్పచయంబుమనంబులోవలం।

గనకసుమంబులేయు నియోగాకృతిభావుకసూచనంబులం।
గనియుకవీనిమందిరము కాంచనసంయుతమానటంచునో॥ 198

వ॥ ఇట్లుదుర్మార్గుండుపౌరులొనర్చు సత్కారంబు లంగీకరించుచు నిజగృహంబునకుం జనియెనప్పుడినుండే వార్తవేల్పుల కెరిం గింపనరిగెనో యనపరాబ్ధిగ్రుంకె దుర్మార్గునకు నిషేకమువే ళ సూచింపవచ్చిన జోస్యుడన చంద్రుండుదయించెనంత నా రాత్రికుకూపిదుర్మార్గులు కేళీకాగారంబునకుంజనిరి తత్క్షణం బుగృహంబగ్ని దగ్ధంబయ్యె జాయాపతులునల్లు లచందంబు నమాడి కృతాంతనిశాంతాతిథులయిరి పిదప సత్ప్రభుండు రాజ్యంబునకువచ్చె ప్రజలుసుమనస్కులైరి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, తపంబుచాలించి తమసతులతోగూడ నిజ పదంబులకేగి సుఖంబున నుండిరని యవివేకి హరిశ్చంద్రున కుజెప్పె॥ 199

గీ॥ ఇలనుదుర్మార్గుకోలముననెవ్వరేని।
గలరెయనినృపుడడిగినకలియుగంబు।
నందునింటింటనూరూరనుందురయ్య।
వేలకోలదియుననియవివేకియనియె॥ 200

వ॥ తరువాత తన సమాగత కారణం బడిగిన యవివేకి యిట్లని యె॥ 201

గీ॥ కలహాపురిగలడొకజన్నిగట్టులుబ్ధ।
నామధేయుడాతడుచిన్ననాటనుండి।

యెరుగడుదినుటబెట్టుటయుతరజనుల।
సొమ్ముకాసించుముష్టికిజోలిగట్టు॥ 202

క॥ ఎంతధనముండినను గా।
సంతయుభోగంబులేకసంభావనకుం।
సంతోషంబునబోవుచు।
వింతకుపెత్తనముబూను పెరచోటైనన్॥ 203

గీ॥ గొడ్డుచచ్చినరాభందుగోర్కెతోడ।
జేరుపగిదినాలుబ్ధుడు చేరునెవ్వ।
రైనచచ్చుటదనచెవిలోనబడిన।
యంతనిల్లునిల్లాలినట్టైవిడిచి॥ 204

చ॥ శవమును జేరిబేరములుసల్పుచుభారముగానదీనికిన్।
నవరసునీయగాదగునునాయముబల్కితిదీనికేగదా।
బవళులుఛాత్రులుందిరిగిపండెనుబుణ్యామటంచువత్తుని।
య్యవసరమిట్లుసేయగద రయ్యమరొక్కటిచూతుమంచనున్॥

గీ॥ కొత్తకుండదడపగోర్కెనెటకునైన।
నేగికార్యమేమొమెరిగివారి।
తిన్నెపైనదానధిష్ఠించియుండును।
గాడుగాచునక్కకరణిధరణి॥ 206

గీ॥ యూకలిచ్చివివాహంబుజేకొనియెడి।
బీదసాదలకడజేరిపెద్దచూపు।

పేర్మిగనవలెననిపీకిపిండిపెట్టు।
బడుగుగొడ్డునుగాcబుపొడిచినట్లు॥

గీ॥ వెలలవేయునులేదనువేలకొలది।
ధనముగైకొనువిటులనుదాన్చగర్భ।
ములనుభేధించిమాన్యభూములనులాగు।
వెధవలతోలినోములపంటవేల్పుతాండు॥

వ॥ అతనికివెర్రెమ్మయనుసతిగలదది॥

గీ॥ పతియలసిగీమునకురానబలమహావ।
తివ్రతాసిరోమణిగానదిట్టుగొట్టు।
మొత్తుజేరెడులేసిదుమ్మెత్తిపోయు।
బమ్మరాకాసిచందానపైనబడును॥

గీ॥ పందివలెనింటపొర్లాడుబ్లవగమువలె।
గంతులిడుమిడుతవిధముగొంతనొగురు।
కుక్కబోలెమొరుగుమిత్తిఫక్కిచిందు।
లాడువెర్రెమ్మనుగడుసమ్మనగనొప్పు॥

ఆ॥ ఔరఔరయంచునట్టహాసముజేసి।
పండ్లుగవ్వగుత్తిపగిదివాగ్రిల।
ముద్దుపీసెమెణ్ణుగుద్దులటంచును।
దద్దగుద్దుమోగనిదర్వ్యబట్టి॥

గీ॥ దాలిగుంటలోనేకులుదాచుచుండు।
కుండలోసగ్గిబెట్టుచువండుచుండు,

కుప్పగాల్చి పేలాలను కోరుచుండు,
నవని వెర్రెమ్మ తనపేరు సార్థకముగ॥ 213

గీ॥ చెలికి పనిపాటల యెడల తెలివియున్న,
గాని మగని నిద్దిట్టుట లోనకంచె,
జేసి యెగరవేయుట యందు నెవ్వరేని!
మొదటి తాంబూలమీవలె ముదిత కెపుడు॥ 212

ఉ॥ ఓరిమరాత్త మోరికుజనోత్తమ యో వెధ వాధ వాధమా!
సారము లేని యీ బ్రతుకు జాలును నింక నుజావ వేరనిన్,
మారితినంగ గోత్రియల మందల పండువ జేతునంచు నే,
నేరము వంక వ్రోసతికి నిష్ఫలపూజలు సేయు నిశ్చలున్॥ 213

గీ॥ భర్తనామంబు మానిని పల్కరాదు,
గాన బండ వెధవ ముండికట్టెతిండి!
పోతపీనుగ వత నాజ్ర పేతియంచు!
నిటుల మంగళహారతులిచ్చు నెపుడు॥ 214

ఉ॥ రా యను నేడ కేగితివి రా యను జెంతకు జేర వే!
రా యను బల్కుకుంటపొగ రా యను ముష్టికి నూరి వెంటపో!
రా యను మింగటాని కెది రా యను గావెడు నీళ్ళు మోచితే!
రా యను గాళ్ళు పట్టగద రా యను జీటికి మాటిమాటికిన్॥ 215

సీ॥ రోగమేమయిన రాదేమి బాగుగాను!
సంధిజనియించి యైన నుజావ వేమి!

కఫముచేనైనసీవిప్డుకాలుపురికి,
జేరవేమిరాఛీయంచుజెలగితిట్టు॥ 216

ఉ॥ అద్దిరయెంతకాలమునకాయువుదీయకయీముగండనే,
మొద్దునుగట్టనామెడనుముప్పుగదావెలిసామినెమ్మికిం,
దద్దయుసంకటంబుగదదగ్ధముజేయుమువీనినంచునే,
పొద్దునబ్రొద్దునుంగనునుమొక్కులువేలకొలందిచేయుచున్

గీ॥ పెక్కుతరములనుండియువెధవలైరి,
మాకులంబుననాచాలురాకపోయె,
తలబఱువువదలకపోయెదైవమేల,
చిన్నచూపుచూచెననుచుజెలగితిట్టు॥ 218

ఆ॥ బిడ్డలున్నవారుబిడ్డలగడుగొట్టి,
తిట్టివారుమనసుదీర్చుకొంద్రు,
గొడ్డురాలుగానకోమలిమగనినె,
తిట్టికొట్టిమనసుదీర్చుకొనును॥ 219

ఉ॥ తిట్టుమునాపదంబులనుదిన్నగనెప్పుడుబట్టకున్నచో,
గొట్టుమునిడ్డనిన్నుననుగూరిమినెత్తినిబెట్టకున్నచో,
పెట్టుముచెంపపెట్టులనువేకువజామునలేవకున్నచో,
నెట్టుమునింటనుండినినునేరమువచ్చినకొంచమైననున్॥ 220

గీ॥ ఊవుసచ్చినచిటికలోనింపుమీఱ,
పాడుమంగళసూత్రంబుబారదెంపి,

పప్పుబెల్లముగొనివేగవండుగంచు,
గొడ్డులాగుననమలెదవెడ్డెవోరి॥ 221

వ॥ ఇట్లు తిట్టినతిట్టు తిట్టకుండ నిత్యవ్రతంబుగా విరామము లేక తిట్టుచుఁ గొట్టుచు తన్నేకొట్టినాడీ కట్టడియుంచు రట్టుసేయుచు నుపపతులఁ దీసికొని వచ్చిన నానాభరణంబుల గైసేయుచు భర్తకుమృత్యుసదృశంబై యుండె॥ 222

గీ॥ వెలిచవులఁ దెప్పమరిగినవెలదిచెంత।
మఁగడుకాపురమునుజేసిమనగలేఁడు।
దయ్యమొద్దనుబిడ్డలుధరణినెందు।
మసగవింటిమెకంటిమె మనుజనాథ॥ 223

క॥ ఈరీతినాలుమగలున్।
వైరంబులతోడనెప్డువసుమతినున్నన్।
గారాబుకూతురొక్కతె।
వారికిజనియించిమోదవార్నిధిదేల్చెన్॥ 224

గీ॥ పిల్లభూమిపయిబడినవెంటవెంట।
మూఁడుకాళ్ళముసలికిచ్చిముడినిపెట్టి।
డబ్బులాగవలెనటంచునుబ్బిబేర।
ములనుజాటుచాటునచేయమొదలుపెట్టె॥ 225

క॥ తనభర్తలుఁ బుద్ధిట్టుల।
గనికరమొక్కింతలేకకాన్పునసమ్మం।

బనిసేయుచున్నాడని।
మనజోక్తివిచిత్రమవినిముండిపడిపతి౯॥ 226

క॥ కనియారయేమిచేసితి!
చెనటీనాయెఱుకలేకశిశువునుఁమ్మం।
గనునీపెత్తనమేనా।
యనిపైఁబడికాళ్ళచేతనటునిటుతన్నె౯॥ 227

ఉ॥ తనివిచనకయంతదండంబురోకలి।
బండలగొనితనదురెండుకరము।
లందుచావుచావుమంచుబిట్టలయుంగ।
గొట్టెగొడ్డుబట్టిగొట్టినట్లు॥ 228

ఆ॥ గంటుకాలవేసికసికరముక్కంత।
లేకవాతబెట్టిలేచిపొమ్ము!
నీకునెలవులేదునీయబ్బగాడితో।
మొత్తుకొమ్మటంచుమోదెమరల॥ 229

వ॥ ఇటులఁగొట్టంబడిన లుబ్ధుండు తనసతీలలామ పాదంబులపై బడి లేవకకంటనుండి నీరుశరీరంబునుండి రుధిరంబుదొరగ వలపోవుచునిట్టులనియె॥ 230

గీ॥ వినుదురాశపత్తనమందు వెలయునొక్క।
భూసురాగ్రణిధూర్తాఖ్యఁబొల్చుపుడమి।
కష్టవతినాగయతనికికాంతగలదు।
వారియన్యోన్యరాగంబువశమెపొగడ॥ 231

వ॥ వారికిత్తొమ్మండుగురు పుత్త్రికలుగలరాసంతానములో॥ 232

సీ॥ ఒకదానిమూఁక వానికినిచ్చెనొకదాని,
నంధునకిచ్చెననువుగాను।
బధిరవరునకొక్కపడతినిచ్చెనునిండు,
వికలాంగునకునిచ్చెవెలదినొకతె।
కుష్ఠురోగునకిచ్చెకోమలినొక్కతె,
నొకదానివీక్షించివెకలికిచ్చె।
పంగునకిడెనొక్తబాలనుముదమార,
నొకపుత్త్రిషండునకొనఁనిచ్చె।

గీ॥ నంచులకొలందిరూకలుసంగ్రహించి।
పెండ్లితాఁడుగట్టినవెనువెంటదోలు।
బర్రెపడ్డకుగట్టిగావలుపుగట్టి।
దోలువిధమునపేరాశధూర్తవరుడు॥ 233

వ॥ ఎనమండ్ర పరిణయంబొనర్చి కడవటితొమ్మిదవ పిల్లకు॥ 234

క॥ దంతములురానిపిల్లకు।
దంతములూడిననరుండెతగజోడంచున్ ।
మంతనమునదలపోయుచు।
గాంతామణితోడనిల్లుగరకరిబలికెన్॥ 235

ఆ॥ పిల్లకారునెలలుచనెవృద్ధధవుని।
వెదకుసమయమువచ్చెనువెలదియేని।

కీర్తమెంతకునమ్ముదమెట్టులనిన।
కష్టపతి దానికిమిగులకనలిమదిని॥ 236

గీ॥ నాకుకాసులపేరునునయముకొంటి।
వేనియుండైనజచ్చినవానికైన।
నిచ్చికొమ్మను సతిమాటకిచ్చమెచ్చి।
దేశదేశములనపుడుతిరుగసాగె॥ 237

గీ॥ కడుపుమాంసమునమ్మెడిఘనుడుధూర్తి।
డతడుభార్యనువిడనాడియఖిలదేశ।
ములవెదకిగనెనల్లునిముసలివాని।
నీగలోకానబుండునీక్షించినట్లు॥ 238

గీ॥ నీవుసచ్చిననేపెద్దనిమురగొనిన।
పిల్లయిల్లాల్గిననిందులోచిల్లిగవ్వ।
రాదుకాటికిబోయినవారిణివగిది।
యనుచురెండుచంచులుదెచ్చెనల్లునొద్ద॥ 239

వ॥ ఇట్లుధనంబునునల్లుని తనవెంటబెట్టుకొని స్వపురంబున కేగి వివాహప్రయత్నంబులొనరించి ముదిపెండ్లికొడుకుం బల్లకి యెక్కుమనిన॥ 240

క॥ కడుముదుకడగుటను నెడలు।
తడబడవడకుచును జేతదండముగొనుచుం।
బుడబుడపల్లకిజతికెల।
బడనప్పుడుపండుకోతివగిదిన్ మెరసెన్॥ 241

గీ॥ పెండ్లికూతుచిన్నదిగానభీతిచేత।
కుఱ్ఱోమొఱ్ఱోలబొబ్బయంచుగోలపెట్ట।
నపుడుముత్తైదువులులేమియరసిపాత।
బోడియమపల్లకినినెక్కె వేడుకలర॥ 242

క॥ వారలబరుపునపల్లకి।
భోరునవంగిపెటపెటనిముత్తునియలుకాఁ౯।
ధారుణిగూలెరిభర్తయు।
దారయువెధవయు ఋ బేడతట్టులపగిదిఁ౯॥ 243

వ॥ ఆనిమిషంబునసే పెండ్లికొడుకేడుకట్లసవారినెక్కె పిదప వా
నిభోగంబుల నత్తమామ లనుభవించిరి కాన మనకట్టిదశ
యబ్బనీవేల బేలవై యుందు నామాటవినుమనిన వెఱ్ఱమ్మవి
నదమ్మ॥ 244

గీ॥ ఇటులలుబ్ధుకువెఱ్ఱెమ్మయీసుతెత్త।
పోఁకసలువుచుండగపిట్ట।
హోఁపిల్లిదీర్చెసనగపుత్రినియమ।
భటులుగోనిజేర్చిరితమదుపత్తనమున॥ 245

క॥ అకటాపరాలమూటా।
గికురించిమొలకుజనితివెఖేదముచేతన్।
వికలతబొందితినిచ్చట।
పకపకనగుచునొకసారిభాషింపగదే॥ 246

గీ॥ బిడ్డ యెడను గల్గిన ప్రేమ చేత।
గాముగాని దానివలన గలుగబోవు।
సొమ్ముకొరకై వాడెంతయు సొమ్మసిల్లి।
యకటవిలపించు దశదిశలాలకించు॥ 247

క॥ తనకూతుగొంచులుబ్ధుడు।
కనికరపుతలంబు జేరగానడువంగం।
గని వెఱ్ఱెమ్మ వచించెను।
జనెదవటకు పిల్లతోడ చయ్యన ననుచున్॥ 248

గీ॥ పెద్దవల్లకాటికి బోదు బిడ్డ సచట।
పెరుగగా నుంతుకోన్నాళ్ళ ప్రేమవీడు।
మనుచు దానికి బోధించి యరిగి శవము।
బూడ్చె దాదలచిన ధనము సకుగాను॥ 249

వ॥ ఖననంబయి సొంత ఇంకికి వచ్చిన యనంతరంబ॥ 250

క॥ దినదినము పిల్ల నడిగెడు।
తనభార్యకు ప్రేతభూమి దాచితి ననుచున్।
వినయుంబు గపల్కె నిరతి।
జనుచుండు ననుదిన మెంచ నసంభావనకున్॥ 251

గీ॥ అదియు భర్తమాటను నమ్మి యాత్తజాత।
పెద్దవలిల కెలయుండుండి వెలది యయ్యె।

రామరుద్రునకంచు నురంజిలంగ,
సాగినపిదప నొకనాడు సంధ్యవేళ॥ 252

ఉ॥ వారుడొకండు మార్గమునవచ్చుచు వెర్రిమయింటిలోపలం।
గూరిమి భోజనంబడుగ గొట్టుచు తిట్టుచు వెళ్ళగొట్టగా।
పారక తిన్నెపై నతడు బబ్బొనగా గని పొమ్మటంచు త్రేం।
గారపుకట్టగొట్టెజనకాపురమేడ నవల్ల కాడ నేగ॥ 253

గీ॥ అవచసమును వెర్రిమ్మయాలకించి।
కూతు కాపురమున నుండెకోర్కెనచట।
గంటివె రామరుద్రునగారమందు।
ననగనే రామరుద్రుండనాత్మభవన।
మందు నున్నదని వచించెనవనిసురుడు॥ 254

గీ॥ అయ్యొ నాయన నీవాయటంచు జేర।
జేరి మృష్టాన్నమును బెట్ట చిన్నపట్టి।
కేమయిన భూషణములున్న వేయసంగ।
నత్తబీద వారికెటుల మరునగలు॥ 255

క॥ అని పెక్కువిధంబుల వే।
దనుబోలెనటించి బొంకి దానిన గల్గె।
క్రొనిమిన్నందివెసంజనె।
గన్నకైతవు లేరివలన గాంచరు ధనముల్॥ 256

గీ॥ నెత్తిమూటతో లుబ్ధుండు నెలవు జేరి।
దివ్వెలేనికంబము భంగి తెరవయుండ।
గారణమడిగికొంపనిష్కారణముగ।
గూల్చివేసితివీవంచుగోలబెట్టె॥ 257

ఆ॥ ఏడకూతురల్లుడేడచచ్చినపిల్ల।
మఱిబ్రమకగలదేమిహాని నందు।
చాలుచాలుకూతుసాకునమ్మృతినొంద।
యోగమబ్బెనయ్యోయువిదమనకు॥ 258

ఆ॥ ముల్లెపొట్టబెట్టిపోసికొంటివెనీళ్ళ।
టంచునెత్తిమొత్తుకొంచురొమ్ము।
బాదుకొనుచునాల్కబారకొలందిని।
లాగికొనుచునంగలార్చెవాడు॥ 259

క॥ ఆమాటలువినివెఱ్ఱిమ॥
భూమింజితిబేర్చియప్డైబొందినివిడిచెన్।
జీమంతైనవెరదొరగి।
వ్యామోహంబెట్టికర్తవడయుదుజగతిన్॥ 260

గీ॥ జ్వరముతోడనెవచ్చెడిచలినిబోలె।
నేనునీతోడవచ్చెదనెలతయంచు।
వ్యయములో వ్యయముకలిసివచ్చెననుచు।
పండునిప్పులమీదపన్నుండెవాడు॥ 261

గీ॥ వారు సచ్చిదయ్యాలయి బట్టినన్ను।
పీకుచుందురుగాన తద్భీతి వచ్చి।
నాడ గరుణింప వేయు ననగుచు సూర।
డించి బంచె హరిశ్చంద్ర నృపతి యపుడు॥ 262

క॥ అనికత నేతరి యిక్కతఁ।
జను వృప్పఁగ బాసవాలు సామల కెలమఁగ।
వినిపించిన వారు దనివి।
చనిచని రంతందమతము సదనంబులకుఁగ॥ 263

సర్వమేకాశ్వాసము,

సంపూర్ణము.

---

విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వర విరచితము.